ఓం శ్రీరామ

# శ్రీ వీరాంజనేయ శతకము



రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్. తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి
M.A., Ph.D.

## శాస్త్రిగారి ఇతర రచనలు



**ముద్రితములు :**

1. శ్రీరామ కథాஉమృతము - సమగ్ర సమీక్ష
   ఆంధ్రా యూనివర్సిటీ వారిచే **Ph.D.**
   పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం - సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం - సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పాపనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)
9. మాటలంటే మాటలా?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము.

**అముద్రితములు :**

1. సత్యనారాయణ శతకము
2. అధ్యాత్మయోగము

## శ్రీ ఆంజనేయ దండకము

**శ్లో: అంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణుశివాత్మకమ్,**
**తరుణార్కప్రభం శాంతం రామదూతం నమామ్యహమ్.**

"శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తి ప్రదాయం భజే వాయుపుత్రం భజే వాలగాత్రం భజేహం పవిత్రం భజే సూర్యమిత్రం భజే వాలగాత్రం భజేహం పవిత్రం భజే రుద్రరూపం భజే బ్రహ్మతేజం" బటంచున్ ప్రభాతంబు సాయంత్రమున్ నీదు సంకీర్తనల్ జేసి నీ రూపువర్ణించి నీ మీద నే దండకం బొక్కటింబాడ నూహించి నీమూర్తినింగాంచి నీ సుందరం బెంచి నీ దాసదాసుండ నై రామ భక్తుండనై నిన్ననే గొల్చెదన్ నిన్ను నే నెంచెదన్ నీ కటాక్షంబునన్‌జూడుమా వేడుకల్ జేయుమా నా మొరాలించుమా నన్ను రక్షించుమా అంజనాదేవి గర్భోదయా దేవ!నిన్నెంచ నే నెంతవాడన్ దయాశాలివై చూడుమా దాతవై బ్రోవుమా దగ్గరన్నిల్వు మా తొల్లి సుగ్రీవుకు న్మంత్రివై స్వామి కార్యంబునందుండి శ్రీరామ సౌమిత్రులం జూచి వారి న్విచారించి సర్వేశు పూజించి అ భ్భానుజుం బంటు గావించి అవ్వాలినిం జంపి కాకుత్థ్స తిలకుం దయా దృష్టి వీక్షించి కిష్కంధనేలించి శ్రీరామ కార్యార్థివై లంకకేతెంచియున్ లంకిణిన్ జంపియున్ లంకనున్ గాల్చియున్ భూమిజం జూచి యానందముప్పొంగి యాయుంగరంబిచ్చి యా రత్నముందెచ్చి శ్రీరామునకున్నిచ్చి సంతోషమున్ జేసి సుగ్రీవుడున్ జాంబవంతుం నలుం నీలు ఆ అంగదున్ కూడి ఆ సేతువున్ దాటి వానరుల్ మూకలై పెన్మూకలై దైత్యులం ద్రుంచగా రావణుండంత కాలాగ్నియై యుగ్రుడైకోరి బ్రహ్మాండమైనట్టి యాశక్తినిన్‌వైచి సౌమిత్రినిన్

-- చివర పేజీలో.

ఓం శ్రీరామ

# శ్రీ వీరాంజనేయ శతకము



రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

**డాక్టర్. తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి**
**M.A., Ph.D.**

హక్కులు : రచయితవి

ప్రథమ ముద్రణ : 1999 - అక్టోబర్ 19
విజయదశమి

ప్రతులు : 1000

వెల : రూ. 10-00

రావణవినాశహేతువై రాజిలంగ
నుత్తరమునుండి దక్షిణంబెత్తి వచ్చు
తోఁకచుక్కనాన్, వీఁక నీ రాక తోచె
నభయమొసఁగుము నాకు వీరాంజనేయ!

శివశ్రీ ప్రచురణలు

ప్రాప్తి స్థానము : **టి. యన్. పద్మావతి**
భావనారాయణ పేట, పొన్నూరు - 522 124.
గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్.
ఫోన్. నెం. (08643) 43566.

ముద్రణ :
సృజన ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గార్లపాటి కోటేశ్వరరావు కాంప్లెక్స్, పొన్నూరు - 522 124.



ఓం శ్రీరామ

# వాచికార్చనము

పుష్పఫలభరిత ద్రుమంబులనుగాని,
చుట్టుఁగల రక్కసులఁగాని చూడక, తన
గుండె గుడిలోని రామునే కొలుచుచుండె,
నన్నమెఱుఁగని యోగిని, యవనిజాత ;

లంకలో రావణుని అశోకవనము నందలి పుష్పఫల భరితమైన ప్రకృతి సంపదను గాని, తన్ను ప్రలోభ పఱుప యత్నించు రావణుని ధనమును, అధికారమును గాని, వివిధాయుధములతో తనను సంహరింతుమని బెదరించు రాక్షస స్త్రీల హెచ్చరికలను గాని, లెక్కసేయక సీత తన మనమున నెలకొన్న రామునే తలచుచున్నది. ఆ ధ్యాసయే ధ్యానమై, సీతకు శ్రీరామప్రభుసాన్నిధ్యమును కల్పించినది. అట్టి సౌశీల్యవంతమైన సీతామహచ్చరితమే రామాయణముగాఁ గీర్తింపఁబడినది. విశేషించి సుందర కాండమున ఆ సౌందర్యము చక్కగా నిరూపింపఁబడినది. హనుమంతుడు ఆచార్యుడై సీతాసమేతుడైన శ్రీరాముని పట్టాభిషేకమహోత్సవమునకు తగిన కృషిచేసి, కృతార్థుడైనాడు.

సుందరకాండపారాయణము చేయునప్పుడు కలిగిన ప్రేరణము వలన "అభయమొసఁగుము నాకు వీరాంజనేయ" అనుమకుటముతో, శతకమొకటి వ్రాసి, స్వామికి వాచికార్చనముగా సమర్పించవలెనను సంకల్పము నా మదిలో మెదలినది. ఆ భగవంతుని దయవలన నేటి కది నెఱవేఱినది. ఇందుకొన్ని పద్యములు వాల్మీకి సుందర కాండములోని ప్రసిద్ధ శ్లోకములకు అనుసరణములుగా రూపొందినవి కావున ఈశతక పఠనము సుందరకాండ కథా విశేషమును స్మరింపఁజేయుచు, సకల శుభములనొసంగఁజాలునని విశ్వసించుచున్నాను.

సీత మనము రాముని యందు, సీత యందు
రాముని మనంబు, నెలకొని రంజిలుటయుఁ
దెలిసి, వారి యద్వైత సిద్ధి వినుతించి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ!

## ధన్యవాదములు

ఈ నా ప్రయత్నమును ప్రోత్సహించి, హార్దికముగా, ఆర్థికముగా, సహకరించిన పెద్దలందఱకు నా ధన్యవాదములు.

డాక్టర్, **తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి**
**M.A. Ph.D**

ఓం శ్రీరామ

# శ్రీ వీరాంజనేయశతకము

1. శ్రీకరంబైన పొన్నూరు సీమలోన
భక్తజనుల పాలిటి కల్పపాదపముగ
వెలసిన నినుగొల్తు శతకంబెలమిఁగూర్చి
యభయమొసఁగుమునాకు వీరాంజనేయ !

2. అంజనాదేవి గర్భాన నద్భుతముగ
నుద్భవించిన స్వామి! నీయుగ్రతేజ
మరయఁగారణ జన్ముఁడ వగుటఁదెలిసె
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ!

3. ఉదయ భాస్కరబింబంబు, నూర్జితఫల
మంచు భావించి, భక్షింపనరుగు, నీదు
సాహస ప్రక్రమమునెల్ల సంస్తుతింతు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ!

4. వాయుపుత్రుఁడవై, వేగవంతుఁడవయి
సూర్యునే మ్రింగఁబోయిన శూరుఁడవని
భక్తిఁదలఁచి కొలిచెద నీ పదయుగమ్ము
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

5. సూర్యుని గ్రసించు రాహువు ఁజూచినంత
నిదియు నల్లని పండని మ్రింగఁబోతి
వాతఁడింద్రునిఁజేరెను భీతుఁడగుచు;
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

6. ఆ గ్రహము మాటవిని, శక్రుఁ డాగ్రహాన
వజ్ర మెత్తి వైచె; జగము వగలఁబొగల,
దేవత ల్వరము లొసఁగి తేర్చిరి నిను !
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



7. లోకహిత బుద్ధిఁగరములన్ సాఁకి, జగతి
వెలుగులనునింపి, జ్ఞానముం దెలుపుగురుని
నిష్ఠతోఁగొల్చి, విద్యలు నేర్చుకొంటి
వభయమొసఁగుము నాకు వీరాంజనేయ !

8. సద్గురుని సూర్యు సేవించి, శాస్త్రమెఱిఁగి,
విద్యలఫలమ్ము సదసద్వివేక మనఁగ
శిష్యతతి విశిష్టుఁడవై ప్రసిద్ధిఁగంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

9. ప్రబల గర్వ దుర్వారుఁడౌ వాలిఁదెగడి,
న్యాయమౌ ప్రభు పక్షము నాశ్రయించి,
యఖిలవానర ముఖ్యుఁడవయి వరలితి,
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

10. రామ లక్ష్మణులను జూచి, భ్రాంతుఁడగుచుఁ
బరువు లిడుచున్న సుగ్రీవు భయముమాన్పి,
ధైర్య మందించి, నిలిపిన తత్త్వవేత్త
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

11. అమల సంస్కార సంపన్న మయిన వాణి,
హృదయ హారిణియగుబాణి, ముదముఁగొలుప
రాముఁడే నీదు ధోరణి రమ్యమనఁడె;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

12. "వేడ్క, నీవంటి దూత లభించెనేని,
యభిమతార్థంబుఁబడయంగ నగు" నటంచుఁ
బ్రేమ నిన్నభినందించె రామభద్రుఁ
డభయమొసఁగుము నాకు వీరాంజనేయ !

13. జీవన మహోదధిఁదరింపఁజిత్తమైన
సత్యధర్మమ్ములుత్తమ సాధనములు
రామునందవి నెలకొన, స్వామిఁగొలిచి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

14. రామ సుగ్రీవులకు మైత్రిఁ బ్రబలఁజేసి,
వాలి, రావణులకుఁ గీడు వాటిలంగ
సీతకును మేలుఁ గలుగగంఁ జేసినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

15. రాజ్య సుఖములఁ దేలుచు రామకార్య
మును మఱచిన సుగ్రీవుఁ బ్రబుద్ధుఁ జేసి.
సీత వెదుకంగ వానర సేనఁబూన్చి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

16. ఎలమి, నణిమాదు, లష్టసిద్ధులు గడించి,
లోక కల్యాణ కాంక్ష నలోలుఁడవయి,
శక్తి యుక్తులు వెలయింపఁజాలినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

17. కరము దుష్కరంబైన సాగరము దాఁటి
సీత పదము నన్వేషింప సిద్ధపడిన
శత్రు కర్శ నుండ, వమిత సాహసుండ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

18. రామబాణమ్ము వోలె, నప్రతిహతమ్ము
వాయు వేగమ్ము, లక్ష్యసంపాదనమ్ము
నగుచు, లంకఁబ్రవేశింప నరిగినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



19. "అన్ని విధముల యత్నంబు లాచరించి
సీతఁ గనుగొని మిమ్ముఁలఁ జేరవత్తు
నిశ్చితంబ"ని పలికిన నిపుణమతివి
యభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

20. ఉదధి మైనాకుఁడాతిథ్య మొసఁగఁబూన,
నదియు, "రామ కార్యంబున కంతరాయ
మ"ని సమాధాన పఱచి, ముందునకు సాగి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

21. మోహజనకమౌ సుఖ సంభ్రమున మునింగి
తొడరు నాకర్షణలకు లోఁబడక, కడచి,
గమ్యమును జేరు యోగ మార్గంబుఁజూపి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

22. సురస నినుఁబరీక్షింప ముందరకు వచ్చి,
నోటిలోఁ బ్రవేశింపఁ బోరాటపడఁగ
యుక్తితోగెల్చి, యభినందనోక్తిఁబడసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

23. గమనమున్ నిరోధించి, యాగ్రహముఁజూపు
సింహికను నీవు బలిమితో సంహరించి,
జగతి కుపకృతిఁజేయుచుఁబ్రగతిఁగాంచి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

24. వాయువును,వైనతేయుండు ప్రబలగతులు
సాగరము దాఁటి రాగల శక్తియుక్తు
లితరు లెవ్వరు సాటిరారెందు నీకు;
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

25. వానరేంద్ర । నీయందున్న వరగుణములు
ధృతియు, దృష్టియు, దాక్ష్యంబు, మతియుఁదలఁపఁ
గార్య సిద్ధియు, విజయంబుఁగలుగు తథ్య
మభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

26. అబ్ధి నవలీల లంఘించి, యవని జాత,
సీత దర్శించి, రామునిక్షేమ వార్తఁ
బ్రీతి వినిపించి, దూతవై ఖ్యాతిఁగంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

27. కడఁగి లంకఁ బ్రవేశింపగాఁదలంచు
నిన్ను వారించు లంకిణి వెన్నుఁ జఱచి,
నీ బలంబుఁబ్రదర్శించి, నెగడినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

28. సీత జాడ నన్వేషించు దూతవగుచు.
"జయమునకు మూలమెంచ, నుత్సాహ మ"ంచు
నాచరణ పూర్వకమ్ముగ నరయఁజేసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

29. "ప్రాణులకు దోషకారణంబైన కృత్య
మాత్మహత్య; మహాపాప"మంచుఁదెలిపి
సత్య సంకల్ప సిద్ధికై సాగినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

30. "బ్రతికి యుండిన శుభములు బడయవచ్చు"
ననెడి సూక్తినొడివి, జీవితాశఁగడఁగి
మహిత కర్తవ్య దీక్ష సమ్మాన్యుఁడవయి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



31 చిత్కళంగాంచు యోగినా, సీతనరయ
నాలుగంగుళముల మేర నేలనైన
విడువక, వెదికితివి లంక విసుగులేక;
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

32. రావణాంతఃపురము నందు రమణులెల్ల
రర్ధ నగ్నంబుగా నుండుటరసి, నీవు
నిర్వికారుఁడవై, జితేంద్రియతఁగంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

33. "ఇంద్రియములుఁబ్రవర్తింప హేతువైన
మనము సువ్యవస్థితముగా ఁదనరెనేని
దోషమే లేద"నవె! తద్విశేష మెఱిఁగి;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

34. వికృతికిని హేతువైనట్టి విషయమందు
మది, వికారమునందని మానవుండె
ధీరుఁడని, నిరూపించిన ధీవరేణ్య !
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

35. భ్రమపడుటలోక సహజమ్ము; భ్రమనువీడి
సత్యమెఱుఁగుట జ్ఞానిలక్షణము; నీవు
రావణుని భార్య, సీతగాభ్రమసి, తెలిసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

36. సీతకును, రామునకుఁదుల్య శీల వృత్త
ములు, వయో రూప లక్షణములు కలవని
దంపతుల నొకరికొకరు తగుదు రంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

37. సీతకునుబ్రత్యయముకల్గి, సేదదేర
రామనామాంకితం బుంగరం బొసంగి,
యుపశమన వాక్యముల్ జెప్పి, యూరడించి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

38. రావణుని దురుక్తులు విని, యేవగించి
జీవితంబును విడువంగ సిద్ధపడిన
సీత, శ్రీరామ కీర్తనఁజేసి, ప్రోచి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

39. వానరులలోనఁ దనయానవాలొసంగి
నిన్ను మన్నించెరామన్న ! నిశ్చయమతి
యత్నమొనరించి సఫలుఁడ వైతివీవు;
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

40. జీవకోటి, నేయొక్కడో దైవమెలయు
రీతిఁ,గపిసేనలో నీవ, సీతఁ గాంచి,
రాముని యనుగ్రహంబు, వరంబు గంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

41. "రాఘవుఁడు నేఁడు నన్ననుగ్రహముతోడ
స్వీకరించు ప్రయత్నంబుఁజేయు" మంచు
సీత నినుఁగోరె, నీదు సౌశీల్యమెంచి;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

42. సుందర సుమనోహరములు, శుభఫలదులు
రాముని గుణ రూపములు వర్ణనముఁజేసి,
సీతకును బ్రీతి సంఘటించితివి నీవ;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



43. "లఘు శరీరులు వానరుల్ లంకఁజేరు
టెట్లు సాధ్యమౌ"నని సంశయించుసీత
కద్భుతమగు నీ రూపంబునరయఁజేసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

44. "కలరు సుగ్రీవు సన్నిధిఁబలువురిట్టి
బలులు; నాకన్న మిన్నలౌవానరు"లని
వినయముగఁ బల్కి, విశ్వాస మొనయఁ జేసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

45. "నేను జీవించియుండ సమ్మానబుద్ధి
రాము ననుఁగూర్చు కార్యభారంబునీదె
హనుమ !" యని, సీత నినుసాయ మడిగె; సామి !
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

46. జీవునకుఁబరమాత్మ ప్రభావమెఱుఁగఁ
జేసి, ముక్తి మార్గ ముపదేశించు గురుని
రీతి, సీతతో రాముగూర్చి వివరించి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

47. రావణుని యశోక వనమ్ముఁరాల్చి, కూల్చి,
రాక్షసుల జంపి, "అక్షుని" ప్రాణమెడపు
నీ విజయ గీతముల్ పాడి, నిన్‌భజింతు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

48. రామలక్ష్మణులను, సీతఁ,బ్రణుతిఁజేసి
యనిల రుద్రేంద్ర, చంద్రార్క, యమ, మరుద్గ
ణంబుఁగొల్చి, రాక్షస విజయంబుఁగంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

49. శిలలు వృక్షమ్ములాయుధమ్ములుగఁదాల్చి
రాక్షస సమూహమును గెల్చి, రమణిఁగొల్చి
లంక మర్దించి, విజయ లలామఁగొంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

50. "జయ మతిబలుండయినరామ జనపతికిఁక"
"జయము సుగ్రీవునకును, లక్ష్మణున" కంచు
గాన మొనరించు నీ గీతికల్ పఠింతు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

51. "రామదాసుఁడ, నాతోడఁ దామసగుణ
రావణ సహస్రమైనను ప్రతిబలంబు
కాద"ని బలిమి గర్జించు ఘనుఁడ వరయ;
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

52. రావణుని సభలోన నిర్భయుఁడ వగుచు
రాము సత్య పరాక్రమ క్రమముఁదెలిపి
బుద్ధిఁజెప్పిన ధీరు, నిన్పొగడఁదరమె ?
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

53. అరయ వానర రూపంబె యౌనుగాని,
అధిప ! నీ దివ్యతేజో మహత్త్వమెన్న
నరిభయంకరము, శ్రితజనావనమ్ము,
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

54. నీదు తేజంబు, రూపంబు, నీదు బలము
నీదుధైర్యంబు, శౌర్యంబు, నీదు బుద్ధిఁ
గాంచి, రావణుం డంతరంగానఁగలఁగె
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



55. కక్షతో, రాక్షసుల్ తోఁకఁగాల్చి విడిచి,
రదియె లంకదహింప నీ కాయుధమ్ము
వారి పాపంబు వారినే భంగపఱచె
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

56. అమిత గాంభీర్య, ధైర్య శౌర్యంబు లలర
లంకరూపు మాయించు, నిశ్శంకు నిన్ను
భక్తిఁదలఁచి, కొలిచెద నీ పదయుగమ్ము
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

57. "చూచి రమ్మన్నఁగాల్చి వచ్చు" కపివీర !
పూర్వ కార్యా విరోధంబు ఁబొసఁగకుండ
మఱి విశేషంబు సాధించు మార్గమరసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

58. నీవు లంక దహించినన్, జీవతత్త్వ
మైన సీత కెట్టి ప్రమాద మేనిలేదు;
దేహమే దహింపఁబడును; దేహి కాదు;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

59. "కోపమును నిరోధింప సంతాపమడఁగు;
ధన్యులట్టి మహాత్ములు తథ్య"మంచు
పాపరహితమౌమార్గంబుఁజూపినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

60. "చూడఁబడెసీత" యని చెప్పి సూక్ష్మముగను;
వానరుల మానసోద్వేగ భరముమాన్పి,
ప్రకట మొనరించి తీవు వాగ్వైభవంబు;
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

61. వానరులకు స్వీయప్రతాపకథనంబు
రామునకు సీత సందేశ రచన వినిచి
వాక్యకుశలుఁడ వైతివి; ప్రణుతకీర్తి !
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

62. మాటఁజెప్పి పుణ్యముఁగను మార్గమనఁగ
"నియత, మక్షతమ"గు సీత నీతి చరిత
రామునకుఁజెప్పవె తదను రాగ మెసఁగ !
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

63. ధర్మమూర్తియౌ శ్రీరాము దయఁదలిర్ప
సీతకుశల వార్తఁదెలిపి, ప్రీతి నెఱపి
"రామకార్యధురంధర" నామ మెనసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

64. స్వార్థమేలేని నీ స్వామి భక్తి మెచ్చి,
కృతమెఱుఁగు రాముఁడు తన కౌగిలియొసంగె,
నా విభుని దయ నీకు సంప్రాప్తమయ్యె
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

65. సుందరుఁడు రాముఁడు, మఱియు సుందరియగు
సీత, సుందరము కథావిశేష, మధిక
సుందరము కాండ, మీవును సుందరుండ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

66. భక్తి సుందరకాండంబు, భావ్యమగుట
సప్త సర్గపారాయణ సలుపువారు
శ్రేయమును, మనోరథసిద్ధి, సిరియు గాంతు
రభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



67. ధర్మ వర్తనుఁడగురాము త్యాగ గుణము
కీర్తనీయ మయ్యెను పార్థగేయ ఫణితి;
తత్కృతిన్ నీవుఁజరితార్థతఁగని నాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

68. మారుతీ! నీదగు పరోపకారబుద్ధి
పుణ్యకార్యంబుఁజేయంగఁబ్రోత్సహించె
నవని జనులకెల్ల శుభము లమరఁజేసె
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

69. పరుల ఁబీడించు పాపులంబట్టి, కొట్టి
రాక్షస వినాశనముఁజేయు రాము గొల్చి
ధర్మకర్మమ్ములం బ్రవృద్ధంబుఁజేసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

70. సీత వార్తఁజెప్పి జటాయువే తరించె;
రామకథ విన్న సంపాతి సేమమెనసె;
వానరులు రాము సేవించి వాసిఁగనిరి;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

71. లంక విజయంబు సూచించె లంకిణి; మును
స్వప్నమునగాంచెఁ దృద్విశేషంబు ఁత్రిజట,
వినిచె ధర్మ మార్గంబు విభీషణుండు;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

72. వారిరాశి గోష్పదముగాఁ బరగఁజేసి
రక్కసుల దోమల వలె నుక్కడంచి
రామచరిత మహామాల రత్నమైతి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

73. భక్త రక్షణ దక్షుఁడౌ స్వామి, రాము
శరణువేడు విభీషణు సౌమనస్య
మెఱుగఁజేసి, ధర్మము సమర్థించు జ్ఞాని
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

74. "ధర్మమును రక్షణముఁజేయ, ధర్మమతని
రక్షణముఁజేయు" ననెడి యార్షవచనంబు
సత్యమయ్యె విభీషణ చరితమందు;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

75. న్యాయమార్గ ప్రవృత్తుఁడౌ నరునకెందు
సాయపడు పశుపక్ష్యాదు లాయతగతి;
తమ్ముఁడన్ననైన విడుచుఁ దప్పఁజేయ
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

76. రామ రావణ సంగ్రామ రంగమందు
మూర్ఛ మునిఁగిన ప్లవగ సమూహములను
బ్రతుకఁజేసిన, ని, న్నమహాబలునిఁగొలుతు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

77. రణమునను మూర్ఛితుఁడగు లక్ష్మణునిఁబ్రోవ
దివ్యమైన సంజీవినిం దెచ్చు, నీదు
సాహసోపేతమగు శక్తి సన్నుతింతు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

78. అడవి మెకములు తనతోడ నడచిరాఁగ
రాము ఁడసహాయ శూరుఁడై రణముగెల్చె;
"నెచట ధర్మమ్మునిలుచునో యచటెజయము"
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



79. సీత శ్రీరాము సన్నిధిఁజేర్చి వా, ర
యోధ్య ఁబట్టాభిషిక్తులై యుండఁజూచు
యోగిపుంగవు నినుఁగొల్తు, నాగమనుతు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

80. గౌరవముగా నొసంగిన హారమందు
రామనామాఽమృతము కానరా దటంచు
జాఱవిడిచిన సదసద్విచారధీర !
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

81. గిరులు, ఝరు లెంతకాలమ్ము ధరణి నిలుచు
నంతకాలమ్ము రామ కథాఽమృతమ్ముఁ
బొలుచు; శాశ్వతుఁడవు నీవు; పూజనీయ !
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

82. రఘుపతి ప్రియ భక్తుఁడ, వఘరహితుఁడ
వతులిత బల ధాముఁడ, వమేయ గుణ నిధివి;
దనుజవన కృశానుఁడవు, ప్రతాపమూర్తి
వభయ మొసఁగుమునాకు వీరాంజనేయ !

83. రామ నామాఽమృతంబు నిరంతర మెదఁ
గ్రోలి, యమరుఁడవైన నీ లీలలెల్ల,
భక్తిఁదలఁచి కొలిచెద నీ పదయుగమ్ము
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

84. సప్తకోటి మహామంత్ర సముదయంబు
చిత్త విభ్రమ కారక స్థితి వహింప
రామనామంబె పరమ మంత్రమని తెలిపి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

85. స్వామి, రఘురాముఁగీర్తించు సీమలందు
బాష్పజల పూర్ణలోచన పద్మఁడవయి,
యంజలి ఘటించి యానంద మనుభవింతు
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

86. బాణమున కన్న నామంబె ప్రబలమనుచు
స్వామి మహిమంబు బ్రకటింపఁ జాలినావు:
జగము శ్రీరామ రక్షగా నెగడుచుండు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

87. గుండె గుడి చేసి, రాముఁ డందుండ నరసి,
కొలుచు రీతి నిరూపింపఁదలచి, నీవు
హృదయము భగవన్నిలయమై యెసఁగఁజేసి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

88. రోమ రోమమునను రామ నామ మెలయ
భక్తి భావంబె రూపమై వరలినావు;
నిన్నుఁగొల్చు భక్తులు మహిమోన్నతులయి
రభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

89. నీ వసాధ్య సాధకుఁడవు దేవ ! నిన్ను
దలఁచినంత, భూత ప్రేతముల భయంబు
తొలఁగు, సకలార్థసిద్ధి, సంతుష్టిఁగలుగు
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

90. నీరు నిన్ను నిలుప లేదు, నిప్పుకాల్చ
లేదు, వాయువేగుఁడ, వవలీల నింగి
లంక కరిగి, భూపుత్రి నావంకఁగంటి
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



91. స్వామి । నిన్ను స్మరించిన వారికెపుడు
బుద్ధి, బలము, యశము, ధైర్యము, పలుకుబడి,
నిర్భయత్వమరోగతల్ నెగడు టరుదె?
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

92. నీకృపాయత్త చిత్తంబు నెమ్మిఁదలఁచి
శరణు వేఁడెద నిన్నార్తి హరుఁడ వనుచు
దిక్కు లేనట్టి వారికి దిక్కునీవె;
అభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

93. కష్ట నష్టములను దీర్చి, కరుణఁబ్రోచి
యష్ట సిద్ధుల నొసఁగూర్చునట్టి సకల
దేవతా స్వరూపుఁడవు, సుస్థిరయశుండ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

94. వాయుతనయుఁడా! బాధలం బాయఁజేసి,
భీతి మాన్పి, కాపాడు సంప్రీతితోడ
సతము మన్నింపు మపరాధ శతము; నతుఁడ
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

95. విషము నమృతంబు, నమృతంబు విషముఁగాఁగఁ
బరిణమింపఁజేయు మహానుభావు,నిన్ను
భక్తిఁగొలుచువారలు సుసంపన్నులగుదు
రభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

96. భోగులకు మోక్ష, మట్లే ముముక్షువులకు
భోగములు లేవు;నినుగొల్చు పుణ్యమతికిఁ
గరతలామలకంబు, లాపరమ సుఖము
లభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

97. పావనీ! నీపదమ్ములు పట్టినాఁడ
సత్కృపాకటాక్ష విశేష సమితితోడ
నన్ను రక్షింపగా సుప్రసన్నుఁడవయి
యభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

98. పిలిచినప్పుడెల్ల పలికి, కలఁతలుడిపి,
కలుములొసఁగు దైవము నిన్నుఁదలఁచికొలుతు,
సేవకుల కొంగు బంగారమౌ వరదుఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

99. "అమిత బలుఁడ, నాతోఁడఁ బోరాడ వేరొ
కండు వీరుండు లేడం"చు గర్వపడెడు
భీమునకు నీ మహత్వంబు వెల్లడించి
తభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

100. నరునిఁగరుణించి, శత్రుసైన్యంబునెల్ల
గెలుచు శక్తి సామర్థ్యముల్ గీలు కొలిపి,
ధ్వజముపై నుండి దీవించి, విజయుఁజేసి
తభయ మొసఁగుము నాకు వీరాజంనేయ !

101. ఎట్టి కష్టమ్ములందైన, నెవ్వరైన,
నర్థి "జయ వీరహనుమాన" టంచుఁదలఁప
వారి యాపదల్ దొలగించి భద్ర మిడుదు
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

102. పంచముఖములు దాల్చి, ప్రపంచ మెల్ల
నిండు నీ మహనీయత నెగడఁజేసి,
సర్వలోకాశ్రయుఁడ వౌట, చాటినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !



103. ఆశ కంతులేదు, నిధుల కవధి లేదు
మోహజలధి నిమగ్నులౌమూఢజనుల
నుద్ధరింపఁజాలిన మహిమోన్నతుండ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

104. భోగ భరితమౌ సంసారసాగరమున
దరియులేదు, జీవనపు భద్రతయు లేదు;
మోహమెడలించి, దగదీర్చి, ముక్తిఁగూర్చి
యభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

105. దేహ మున్నంత వఱకు సందేహమెలయు
వత్సలత నన్ను మన్నించి వరదుఁడవయి
తగిన రీతినడపు మీవె; తర్కమేల?
అభయ మొసఁగుమునాకు వీరాంజనేయ !

106. గురువు దైవంబుఁగొలుచు సచ్చరితఁగలిగి,
తల్లి దండ్రుల మది నుల్లసిల్లఁజేసి,
యుత్తమోత్తమ వ్యక్తిత్వ మూనినాఁడ
వభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

107. స్వామి! రాఁబోవు యుగముల బ్రహ్మవనుచు
నిన్ను సంహితల్ పెక్కు వర్ణించె మున్ను;
నేను నీవాఁడ; దయఁజూడు, నెనరుతోడ;
నభయ మొసఁగుము నాకు వీరాంజనేయ !

108. అలరు కదళీవనంబులఁ గొలువుఁదీరి,
భక్తిఁదలఁచు జనులకు సౌభాగ్యమిచ్చి
చేరి నినుఁగొల్చు వారికి ఁ గోరికలిడు
దభయ మొసఁగుము నాకు వీరాజంనేయ !

109. ధ్యాన, మావాహనం, బాస, నార్ఘ్య, పాద్య
ములను, స్నానాచమన, వస్త్రములను, గంధ
పుష్పముల, ధూపదీపాల(బూజ(జేతు
నభయ మొస(గుము నాకు వీరాంజనేయ !

110. మధుర పరిపక్వ ఫలములు, మధు, దధి, ఘృత
సూప, శాకంబు, లప్పా, లపూపములు,న
వోదనంబు, నీకిడుదు నివేదనంబు;
అభయ మొస(గుము నాకు వీరాంజనేయ !

111. నాగవల్లీ దళంబుల, (బూగఫలము(
జేర్చి, తాంబూలమున్ గూర్చి యర్చసేతు
సారసారస్వతాధార చరణ!శరణు;
అభయ మొస(గుము నాకు వీరాంజనేయ !

112. కప్పురంపు నీరాజనం బొప్ప(జేసి
ఛత్ర చామరాద్యుపచార చయము(గూర్చి
నృత్యగీత వాద్యములతో నియతి(గొలుతు
నభయ మొస(గుము నాకు వీరాంజనేయ!

113. పవలు రే లపరాధముల్ బరగ(జేయు
నన్ను క్షమియింపుమోస్వామి! యున్నతమతి;
దాసుని దోసంగు దండముతో సరియగు;
అభయమొసగుము నాకు వీరాంజనేయ!

114. నీదు నామంబు, (గవచంబు, నీదు మంత్ర,
తంత్ర, జప,తప,స్తోత్రముల్ దండకములు
క్రతుఫలము లిచ్చు, వ్రతనిష్ఠ(గలుగు శుభము;
లభయ మొస(గుము నాకు వీరాంజనేయ !

మూర్ఛనొందింపగా నప్పుడే పోయి సంజీవినిన్ దెచ్చి రామానుజు ప్రాణముల్ రక్షకావించియున్ కుంభకర్ణాది వీరాధి వీరుల్ మరిం బోర శ్రీరామ బాణాగ్ని వారందరరిన్ రావణున్ జంపంగ నంత లోకంబు లానంద మైయుండ యవ్వేళనవ్విభీషణున్ వేడుకన్ దోడుకన్ వచ్చి పట్టాభిషేకంబు చేయించి సీతామహాదేవినిం దెచ్చి శ్రీరామునకు నిచ్చి మెచ్చి అయోధ్యకున్ వచ్చి పట్టభిషేకం బనేకంబు సంరంభమైయున్న నీకన్న నా కెవ్వరున్ కూర్మిలేరంచు మన్నించినన్ రామభక్తప్రశస్తంబుగా నిన్ను. నీ నామ సంకీర్తనల్ జేసినన్ పాపముల్ బాయునే భీతియున్ దీరునే భాగ్యముల్ కల్గునే సర్వసామ్రాజ్యముల్ సర్వ సంపత్తులున్ కల్గునే వానరాకార యోభక్తమందార యో పుణ్యసంచార యోధీర యోవీర నీవే సమస్తంబు నీవే మహావీరుండవై మహాశక్తివై తారక బ్రహ్మమంత్రస్య తింజేసి స్థైర్యమ్ముగా వజ్రదేహమ్మునుందాల్చి 'శ్రీరామ శ్రీరామ శ్రీరామ' యంచున్ మనః పూరితంబై యెవ్వడుందవ్వకన్‌దల్చు నాజివ్హాయుండుండి నీ దీర్ఘదేహంబునన్ లోకసంచారివై రామనా మాంకితధ్యానివై బ్రహ్మవై బ్రహ్మతేజంబునన్ రౌద్ర నిజ్వాల కల్లోల హా వీర యోధీర ఓంకార హ్రీంకార శబ్దంబులన్ భూతపైశాచిక ప్రేతంబులన్ శాకినీ ఢాకినీ గాలిదయ్యంబులన్ నీదు వాలంబునన్ జుట్టి నేలంబడం గొట్టి నీ ముష్టి ఘూతంబులన్ బాహుదండంబులన్ రోమఖండంబులన్ ద్రెంచి కాలాగ్ని రుద్రుండవై బ్రహ్మతేజ ప్రభాభాసితంబైన నీ దివ్య తేజంబునుం జూచి రారా నృసింహాయటంచున్ దయాదృష్టి వీక్షించి నన్నేలు నాస్వామి! నమస్తే సదా బ్రహ్మచారీ నమస్తే వాయు పుత్రా నమస్తే నమస్తే నమః

శ్లో. యత్రయత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ !
భాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమతరాక్షసాంతకమ్ ॥